


# వేతనముల చెల్లింపు చట్టము

# 1936



కేంద్ర కార్మిక విద్యా సంస్థ



# వేతనముల చెల్లింపు చట్టము

# 1936

మహారాష్ట్ర ప్రభుత్వమువారిచే ముద్రింపబడిన "హాండ్ బుక్ ఆఫ్
లేబర్ లాస్ — పేమెంట్ ఆఫ్ వేజెస్ ఆక్టు, 1936"
నుండి శ్రీ ఎమ్. రాధాస్వామిచే అనువదించి
ప్రకటింపబడినది.



కేంద్ర కార్మిక విద్యా సంస్థ నాగపూరువారిచే తయారుచేయబడి,
కృష్ణాపత్రిక ప్రెస్, హైదరాబాద్ వారిచే ముద్రింపబడినది.
తెలుగు 3,000, కాపీలు: మార్చి, 1963.

# పీఠిక

ఇతివృత్తము : ఈ చట్టము రాకమునుపు రైల్వేలలోను అనవరత ఫ్యాక్టరీలలోను కూలీలపై జరిమానాలు విధించు పద్ధతి సర్వసాధారణముగా అమలులో వుండెడిది. జరిమానాలు మాత్రమేకాక వేతనమునుంచి మఱి యితరవిధములైన తీసివేతలు అమలుజరిపేవారు. ఉదాహరణకు వైద్యసహాయార్థమునకని, విద్యావసతులకని, పఠనాలయములకని, వేతనముపై తీసికొన్న అడ్వాన్సులకయిన వడ్డీక్రింద, ఫ్యాక్టరీ యజమానులే నిర్ణయించిన మతసంబంధ మరియు ధార్మిక ప్రయోజనములకుగాను, ఈ తీసివేతలు అమలుజరిపేవారు. బట్టలమిల్లులో నేత పనివాడు చెడగొట్టిన గుడ్డను టోకువెల ప్రకారము యజమాని పనివానికే అంటగట్టడము జరిగేది. కొన్ని మిల్లులలో కార్మికుడు పనికి ఒకరోజు గైరుహాజరయిన, అతని వేతనమునుంచి రెండు రోజుల కూలి తీసివేసే పద్ధతి అమలులో వుండేది. 1926 వ సంవత్సరములో జరిమానాలు మరియు వేతనమునుంచి అమలు జరిపే "తీసివేతలు" ఎంతవరకు అమలుజరుపవచ్చునన్న విషయము ఒక క్రమపద్ధతిలో నుంచుటకుగాను శాసన ఆవశ్యకతను గురించి, భారత ప్రభుత్వము ఒక ప్రశ్న లేవదీసింది. ఒక్క బొంబాయి ప్రభుత్వము మినహా మిగతా రాష్ట్రప్రభుత్వములన్నీ అట్టి శాసనావశ్యకత లేదన్న అభిప్రాయమును వెలిబుచ్చినవి.

అటుపిమ్మట భారతదేశమందలి కార్మిక సమస్యల పరిశీలనకుగాను నియమింపబడిన రాయలు కమీషనుకూడా ఈ విషయాన్ని పరిశీలించడము జరిగినది. జరిమానాలు, వేతనముల నుంచి అమలుజరిపే తీసివేతల విషయములో రాయల కమీషను

శాసన నిర్మాణము అవసరమే కాక వాంఛనీయమన్న సిఫార్సును చేసినది. ఈ కమీషను చేసిన సిఫార్సులు దిగువ వుదహరింపబడినవి.

(అ) జరిమానాలు:— (౧) అర్భకులపై జరిమానాలు విధింపరాదు.

(౨) జరిమానా చెల్లింపు కాలము, దానిని విధించిన తేది నుంచి ఒక మాసముకన్నా మించరాదు.

(౩) ఏ మాస మందైనను జరిమానాల మొత్తము, కార్మికుని వేతనములోని ప్రతిరూపాయికి అర్ధణాకన్నా మించరాదు.

(౪) జరిమానాలద్వారా వసూలైన మొత్తము, నిర్ణయిత అధికార పురుషుని ఒప్పుదల పొంది, మరియు సర్వకార్మికులకు లాభదాయకమైన ప్రయోజనమునకు మాత్రమే జమ కట్టవలెను.

(౫) ఎట్టి 'చర్యలు లేక లోపములు'కుగాను జరిమానాలు విధింపబడునో వాటిని గురించి యజమానులు నోటీసులు ప్రదర్శింపవలెను. అటుల స్పష్టీకరింపబడని 'చర్యలు లేక లోపములు'కు జరిమానాలు విధించిన, అట్టి జరిమానాలను చట్టవిరుద్ధముగా పరిగణించవలెను.

(ఆ) వస్తువులకు కలిగిన నష్టము లేక హానిని గురించిన తీసివేతలు:— ఎట్టి పరిస్థితులలోను యీ పద్దుక్రింద తీసివేతలు నష్టమైన వస్తువుల టోకుధరను మించరాదు.

(ఇ) స్పష్టీకరించిన యితర కారణములు లేక లాభముల గురించి తీసివేతలు :—

(i) గృహావసతి అమర్చినందులకు, పనిముట్లు మరియు ముడిపదార్థములు సరఫరాచేసినందుకు, వేతనమునుంచి తీసి

వేతలు వుండవచ్చును. మిగతా విషయాల్లో రాష్ట్రప్రభుత్వపు గాని లేక రాష్ట్రప్రభుత్వముచే నియుక్తులైన అధికారియొక్క గాని సాధారణ లేక ప్రత్యేక అనుమతి వుంటేనే, తీసివేతలు అమలుజరుపవచ్చును.

(ii) ప్రతి పద్దుక్రింద కూడా తీసివేసిన మొత్తము, కలుగజేసిన ప్రయోజనపు విలువను మించరాదు.

చట్టము అనుమతించని ఏ విధమైన తీసివేతగాని అమలుజరిపే పక్షములో, అట్టి తీసివేతలు అమలుజరిపినందులకు బాధ్యులైనవారికి శిక్ష విధించవలెననికూడా కమీషను సిఫార్సుచేసినది.

1936 వ సంవత్సరము వేతనము చెల్లింపు చట్టమునకు ఈ సిఫార్సులే మూలము.

ఉద్దేశ్యము :— ఈ చట్టము పీఠికలో పేర్కొన్నట్టుగా పరిశ్రమలో పనిచేయు కొన్ని తరగతుల వ్యక్తులకు వేతనము చెల్లింపును క్రమపద్ధతిలో వుంచుట ఈ చట్టముయొక్క వుద్దేశ్యము. ఈ చట్టముద్వారా అమలుజరుపదలచుకొన్న క్రమపద్ధతి రెండురకాలుగా వుంటుంది. (1) వేతన చెల్లింపు తేదిగురించి ; (2) వేతనమునుంచి జరిమానా రూపేణా లేక మరివేరేవిధముగా తీసివేసే మొత్తముల గురించి మాసమునకు సరాసరి నాలుగు వందలు లేక అంతకుమించిగాని వేతనము సంపాదించెడివారికి చట్టము వర్తింపదు. కాబట్టి చట్టములో పేర్కొన్న "కొన్నితరగతులు" అన్న పదము గమనించదగినది.

వర్తింపు :- ఈ చట్టము యావద్భారతదేశానికి వర్తిస్తుంది. చట్టము ఫ్యాక్టరీలలో, రైల్వేలలో, రైల్వే యాజమాన్యమువారితో కాంట్రాక్టు తీసికున్న వ్యక్తులక్రింద పనిచేయువారలందరికి వర్తిస్తుంది. మూడునెలల నోటీసు యిచ్చి రాష్ట్రప్రభుత్వమువారు ఈ చట్టమును ఏ 'పారిశ్రామిక సంస్థ'లో

నైనా లేక ఏ తరగతి లేక ఏ వర్గానికి చెందిన పారిశ్రామిక సంస్థలలోనైనా, పనిచేసే ఏ తరగతి వ్యక్తులకైనా వర్తింప జేయవచ్చును.

నిర్వచనములు:— ఫాక్టరీ అన్న పదమునకు అర్థము 1948 వ సంవత్సరపు ఫాక్టరీ చట్టములో యిచ్చిన అర్థమునే గ్రహింపవలెను. అదే విధముగా "రైల్వే యజమాన్యము' అనే పదమునకు 1890 వ సంవత్సరపు భారత రైల్వే చట్టములో యిచ్చిన అర్థమునే గ్రహింపవలెను.

'పారిశ్రామిక సంస్థ' అన్న పదము దిగువ పేర్కొన బడిన సంస్థ లన్నిటికి వర్తిస్తుంది. (అ) ట్రాములు, బస్సురవాణా సంస్థలు, (ఆ) ఓడరేవులు, పడవరేవులు (ఇ) యాంత్రిక శక్తితో నడిచే దేశీయ నౌకలు (ఈ) గనులు, రాళ్లగనులు, నూనె బావులు (ఉ) తోటలు (ఊ) వస్తువుల వినియోగమునకు లేక రవాణాకు లేక విక్రయమునకుగాను అట్టివస్తువుల యొక్క వుత్పత్తి లేక రూపాంతరములో నిమగ్నమైన సంస్థలు (ఎ) రస్తాలు, వంతెనలు, కాలువలు, కట్టడముల, నిర్మాణ పోషణ అభివృద్ధికార్యములయందు నిమగ్నమైన సంస్థలు. (ఏ) నీటిపారుదల, నౌకాయానములో నిమగ్నమైన సంస్థలు, విద్యుచ్ఛక్తి లేదా మఱి ఏ ఇతరశక్తియొక్కగాని వుత్పత్తి, రవాణా సరఫరాలలో నిమగ్నమైన సంస్థలు.

'పారిశ్రామిక సంస్థ' అన్న పదభావ నిర్వచనలో 'తోటలు' చేర్చినప్పటికి, అది సింకోనా, రబ్బరు, కాఫీ, తేయాకు పండించు భూములుగా విస్తృత నిర్వచన మీయబడినది.

## వేతనము అనగా ఏమి ?

వేతనముయొక్క నిర్వచనము అన్నిటికంటె ప్రాధాన్య మైనది. ఈ క్రింద వుదహరింపబడిన మొత్తములన్నియు వేతన ములో చేర్చి, దానియొక్క అర్థము విస్తృతము కావింపబడినది.

(౧) తీర్పుద్వారాగాని సెటిల్మెంటుద్వారాగాని చెల్లింప వలసిన ప్రతిఫలము.

(౨) కాలావధిని మించి చేసిన పనికి, సెలవురోజులలో పర్వపు దినాలలో చేసిన పనికి, చెల్లింపవలసిన ప్రతిఫలము.

(౩) 'బోనసు' అనిగాని, మఱి ఏ యితర పేరుతోగాని యజమానిచే వుద్యోగపు ఖరారు ప్రకారము, చెల్లింపవలసిన అనుబంధ ప్రతిఫలము.

(౪) ఉద్యోగిని, వుద్యోగముచుంచి తొలగించునపుడు చట్టరీత్యా లేక కాంట్రాక్టురీత్యా, అతనికి చెల్లింపవలసిన ప్రతి ఫలము.

(౫) ఏ చట్టమైనాసరే, ఆ చట్టముక్రింద ఏర్పాటైన ఎట్టి పథకమైనా సరే అట్టి పథకముక్రింద చెల్లింపవలసిన ఎట్టి మొత్తమైనా.

కాని 'వేతనము' యొక్క నిర్వచనములో, ఈ క్రింద వుదహరించిన మొత్తములు చేర్చలేదు.

(౧) ఉద్యోగపు ఖరారుద్వారా, తీర్పుద్వారా, సెటిల్మెంటుద్వారా గాకుండా, వేరేవిధముగా చెల్లింపబడే బోనసు.

(౨) గృహవసతి, విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా, వైద్య సహాయముయొక్క విలువలేకాక, రాష్ట్రప్రభుత్వము వారి సాధారణ లేక ప్రత్యేక వుత్తర్వులచే వర్జింపబడిన యితర వసతుల లేక ప్రయోజనముల విలువ.

(౩) యజమానిచే ఫించనుకు, ప్రావిడెంటు ఫండుకు చెల్లింపబడిన చందాలు.

(౪) ప్రయాణపు బత్తెము లేక వుద్యోగపు స్వభావమును బట్టి అతనికిగాను పెట్టిన ఖర్చు.

(౫) ఉద్యోగమునుండి తొలగించినపుడు చెల్లింపవలసిన యినాము (గ్రాచ్యుటీ).

# చెల్లింపులు

## వేతనము చెల్లింపుకు బాధ్యులు

వేతనము చెల్లింపు విషయములో ముఖ్యముగా యజమానిదే బాధ్యత. ఫ్యాక్టరీలయందు ఈ బాధ్యత 1948 వ సంవత్సరపు ఫ్యాక్టరీ చట్టపు సెక్షను 7 (1) ప్రకారము మానేజరుగా నిర్ణయింపబడిన వ్యక్తిపై వుంచబడినది. పారిశ్రామిక సంస్థల విషయములో, యజమానిచే ఆ సంస్థ పర్యవేక్షణ, అదుపు అప్పగింపబడిన వ్యక్తియందు ఈ బాధ్యత వుంచబడినది. రైల్వేలలో రైల్వే పరిపాలనావర్గముచే, వేతనము చెల్లింపుకు నియుక్తుడైన వ్యక్తియందు ఈ బాధ్యత వుంచబడినది.

వేతనకాలము :- వేతనము చెల్లింపునకు బాధ్యుడైన వ్యక్తి అట్టి వేతనము ఒనకూడు వేతనకాలమును నిర్ణయింపవలెను. ఈ వేతనకాలము ఎట్టి పరిస్థితులలోను ఒకమాసమునకు మించరాదు.

వేతనము చెల్లింపవలసిన సమయము:— వేతనము చెల్లింపవలసిన సమయము ఆ సంస్థ రైల్వేగాని, ఫ్యాక్టరీగాని మరి ఏ యితర పారిశ్రామికసంస్థయైనాగాని, అందు పనిచేయు వ్యక్తుల సంఖ్యపై ఆధారపడియుండును. ఈ సంఖ్య వెయ్యికి లోపుగావున్న పక్షములో వేతనకాలము చివరిరోజునుంచి ఏడు రోజుల లోపుగా వేతనము చెల్లింపవలెను. ఈ సంఖ్య వెయ్యి లేక అంతకుమించిగాని వున్నట్టులైన, వేతనకాలము చివరి రోజునుంచి పదిరోజులలోపున చెల్లింపవలెను.

ఉద్యోగిని పనినుంచి తొలగించే పక్షములో, అతనిని వుద్యోగమునుంచి తొలగించిన రోజునుంచి రెండురోజులలోపున అతని వేతనము చెల్లింపవలెను. రెండురోజు లనగా, రెండు పని చేయురోజులుగా గ్రహింపవలెను. సెలవుదినములలెక్కింపరాదు.

వేతనము చెల్లింపు పనిరోజుననే జరుగవలెను. అందులకు గాను వుద్యోగులను సెలవుదినములలో రమ్మనరాదు.

వేతనము చెల్లింపు:— వేతనము చెల్లింపు, చెల్లింపు సమయమునకు ప్రచారములోనున్న నాణెముద్వారాగాని లేక నోట్లద్వారాగాని లేక రెండింటిమూలముగాగాని చెల్లింపవలెను. ధాన్యరూపంగా కానీ, లేక వస్తురూపంగాకానీ చెల్లింప వీలు లేదు.

## తీసివేతలు

### చట్టముక్రింద అనుమతింపబడిన "తీసివేతలు":—

వేతనమునుంచి చట్టము అనుమతించిన 'తీసివేతలు' తప్ప మరి ఏ విధమైన 'తీసివేతలు' అమలు జరుపుటకు వీలులేదు. యజమానికిగాని, అతని ఏజెంటుకుగాని చెల్లించిన మొత్తము 'తీసివేతగా' భావింపబడును. ప్రభుత్వము నిర్ణయించిన రూల్సు ప్రకారము విధించిన ఇంక్రిమెంటు ఆపుదల, ప్రమోషను ఆపుదల, తగ్గువుద్యోగానికి బదలాయింపు, తగ్గుస్కేలుకు మార్పు, సస్పెన్షను మొదలైన పెనాలిటీలవల్ల వేతనమునకు నష్టము కలిగినచో, అట్టి నష్టమును 'తీసివేత' క్రింద భావింపరాదు.

### దిగువ వుదహరించిన 'తీసివేతల'ను చట్టము గుర్తిస్తుంది:

(అ) జరిమానాలు:— రాష్ట్రప్రభుత్వము ఒప్పుదలపొంది, ఫ్యాక్టరీ ముఖద్వారమువద్దగాని లేక సమీపములోగాని, బాహాటముగాగాని ప్రదర్శింపబడిన 'చర్యలు లేక లోపముల' పట్ల మాత్రమే విధించవలెను. ఏ 'చర్యలు లేక లోపముల' పట్ల జరిమానాలు విధించవచ్చునో, వాటికి ఒప్పుదల ఇవ్వగల అధికారము ఫ్యాక్టరీల ముఖ్యతనిఖీదారుకు ఇవ్వబడినది. జరిమానాలు విధించు అధికారము ఇద్దరికి మాత్రమే కలదు. ఒకరు ఫ్యాక్టరీ

యజమాని. రెండవవారు ఫ్యాక్టరీల ముఖ్యతనిఖీదారుకు తెలిపి యజమానిచే ఈ పనికిగాను ప్రత్యేకముగా నియుక్తుడైన వ్యక్తి. ప్రతి జరిమాన, వుద్యోగి సంజాయిషీ విన్నతర్వాతనే విధించవలెను. జరిమానాల రూపముగా వసూలైన నిధిని ఆ ఫ్యాక్టరీ లేక పారిశ్రామిక సంస్థలో పనిచేయు కార్మికులకు లాభదాయకమై నియమిత అధికారి ఒప్పుదల పొందిన ప్రయోజనములకు మాత్రమే ఖర్చుపెట్టవలెను.

(ఆ) పనినుంచి గైరుహాజరు అయిన కాలమునకు "తీసివేతలు":-

వుద్యోగి వుద్యోగరీత్యా పనిచేయవలసిన నిర్ణీత స్థలములనుంచి గైరుహాజరు అయినపుడే ఈ తీసివేత అమలు జరుపవలెను. ఫ్యాక్టరీ అంతర్గత సమ్మెవల్లగాని, మరి ఏ యితర సబబులేని కారణమువల్లగాని, పనిచేయు స్థలములోవుండికూడా వుద్యోగి పనిచేయను నిరాకరించిన, అతను పనిచేయు స్థలము నుండి గైరుహాజరు అయినట్లే భావింపబడును. కాంట్రాక్టు వుల్లంఘన నేరముక్రింద అట్టి తీసివేతలను పదునైదు సంవత్సరములలోపుగావున్న వ్యక్తుల వేతనమునుంచి, ఆ మహిళల వేతనమునుంచిగాని అమలు జరుపరాదు. ఈ తీసివేతకు ఆధారమైన గైరుహాజరు, అతడు పని చేయవలసిన పూర్తికాలమునకుగాని, లేక కొద్దికాలమునకుగాని వుండవచ్చును. అట్టి తీసివేత మొత్తమునకు, వేతనమునకుగల నిష్పత్తి, అతడు గైరుహాజరు అయిన కాలమునకు, అతడు పనిచేయవలసిన పూర్తికాలమునకు గల నిష్పత్తితో సమానముగా నుండవలెను. కాని పది లేక అంతకు మించి కార్మికులు కలిసికట్టుగా వుద్యోగనిబంధనలరీత్యా తగువైన నోటీసు యివ్వకుండా, పనికిరానిచో పద్దుక్రింద తీసివేత మొత్తము, అతనికి లేక వారి ఎనిమిదిరోజుల వేతనమువరకు పెంచవచ్చును. ఈ విషయముగా రాష్ట్ర ప్రభుత్వము రూల్సు తయారుచేయవలెను.

(ఇ) ఉద్యోగి అజాగ్రత్త వల్ల లేక కార్యలోపమువల్ల అతని అధీనములో వుంచిన వస్తువులకు కలిగిన హాని లేక నష్టమునకుగాను లేక అతను లెక్క చెప్పవలసిన డబ్బు పోగొట్టినందులకు అమలు జరిపే తీసివేతలు.

ఈ పద్దుక్రింద అమలుజరుపు తీసివేతలు, యజమానికి కలిగిన హాని లేక నష్టమునకు మించరాదు. అనగా అట్టి తీసి వేతల మూలముగా యజమాని లాభము పొందరాదు. నష్టము కలిగించిన కార్మికుడు సంజాయిషీ చెప్పుకొనుటకు అవకాశ మివ్వనిదే అట్టి తీసివేతలు అమలుజరుప వీలులేదు. ఈ తీసివేతల విషయములో ఒక పద్ధతి వెలువరించుటకు రాష్ట్రప్రభుత్వము నకు అధికార మొసగబడినది.

(ఈ) యజమానిగాని లేక ప్రభుత్వముగాని లేక శాసనబద్ధమైన గృహబోర్డుగాని, లేక ప్రభుత్వముచే గుర్తింపబడి సరసమైన గృహవసతి కలుగచేయు మరి ఏ ఇతర అథారిటీగాని అమర్చిన గృహవసతికిగాను తీసివేతలు.

(ఉ) యజమాని ఒనగూర్చిన వసతులకు, ప్రయోజనములకుగాను తీసివేతలు.

ఈ పై రెండు పద్దులక్రింద తీసివేతలు ఒకటిగా జేర్చి చర్చింపవచ్చును. (ఉ) క్రింద ఉదహరింపబడిన ప్రయోజనము లలో, వుద్యోగ నిర్వహణకు అవసరములై, యజమానిచే సరఫరా చేయబడిన "కొరముట్లు" "ముడిపదార్థములు" చేర్చబడ లేదు. కాబట్టి వాటికిగాను 'తీసివేత' అమలు జరుపుటకు వీలు లేదు. ఈ పద్దులక్రింద తీసివేసిన మొత్తము అమర్చిన గృహ వసతి, ఒనకూర్చిన వసతుల లేక ప్రయోజనముల విలువను మించ రాదు. (ఉ) పద్దుక్రింద తీసివేతల విషయములో రూల్సు తయారుచేయుటకు రాష్ట్రప్రభుత్వమునకు అధికార మొసగ

బడినది. 'తీసివేతలు' అమలుపరచదగిన వసతులు మరియు ప్రయోజనములగురించి, రాష్ట్ర ప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక పుత్తరువుద్వారా అధికార మొసగవలెను.

**(ఊ) అధికముగా చెల్లించిన వేతనము సర్దుటకు, అడ్వాన్సులను వసూలుచేయుటకుగాను 'తీసివేతలు'.**

అడ్వాన్సులను, వుద్యోగములో చేరకముందైనా లేక చేరినతర్వాతనైనా యిచ్చివుండవచ్చును. ఉద్యోగములో చేరక ముందు యిచ్చినఅడ్వాన్సులు రెండురకములుగా వుండవచ్చును. (1) ప్రయాణపు ఖర్చులకుగాను, (2) ఇతర ఖర్చులకుగాను. ప్రయాణపు ఖర్చులకుగాను యిచ్చిన అడ్వాన్సు తిరిగి రాబట్టుటకు వీలులేదు. ఇతర ఖర్చులకు యిచ్చిన అడ్వాన్సును వసూలు చేయవచ్చును. దానికిగా తీసివేయు మొత్తము పూర్తి వేతన కాలమునకు చెల్లించిన మొదటి వేతనమునుంచి అమలు జరుప వచ్చును. ఉద్యోగములోచేరిన తర్వాత యిచ్చే అడ్వాన్సులు, గడించని వేతనమురూపములో వుండును. ఈ అడ్వాన్సులు వీటి విషయముగా రాష్ట్ర ప్రభుత్వమువారు ఏర్పరచిన నియమముల అనుసరించి ఇవ్వవలెను. ఈ చట్టముక్రింద రాష్ట్ర ప్రభుత్వము వారు తయారుచేసిన రూల్సు ప్రకారము, అడ్వాన్సు మొత్తము, వసూలుచేయదగిన వాయిదాలసంఖ్య, వసూలు చేయుటకు పట్టుకాలము. వడ్డీ రేటులను గురించి, హద్దులు ఏర్పరచడము జరిగినది. వేతనమునుంచి ఈ పద్దుక్రింద అమలుజరిపే 'తీసి వేతలు' కచ్చితముగా ఈ హద్దులను అనుసరించవలెను.

**(ఎ) ఉద్యోగి చెల్లింపవలసిన ఆదాయపుపన్నుకుగాను తీసివేత**

ఉద్యోగి చెల్లింపవలసిన ఆదాయపు పన్ను, ఆదాయపు పన్ను చట్టములోని అంశములపై ఆధారపడియుండును. దీనికి గాను తీసివేయు మొత్తము; చెల్లింపవలసిన పన్నుకు సమా

 

నము. పూర్తి మొత్తము, ఒక నెల వేతనమునుండి తీసివేసిన, ఉద్యోగికి ఇబ్బంది కలుగును కాబట్టి దానిని పండ్రెండు వంతులలో వసూలు చేయవచ్చును.

(ఏ) కోర్టువారి వుత్తరువువల్లగాని, లేక అట్టివుత్తర్వు నివ్వగలిగిన మరి ఏ యితర అధికార పురుషుల వుత్తరువు వలగాని అమలు పరచవలసిన తీసివేతలు.

(ఐ) ప్రావిడెంటు ఫండు చందాకు ఆ ప్రావిడెంటు ఫండుపై తీసుకొన్న అడ్వాన్సుల చెల్లింపుకుగాను తీసివేతలు.

ఈ 'తీసివేత'లు అమలు జరుపవలెనన్న కొన్ని నిబంధనలను పాటించవలెను. అవి ఏమనగా (1) అట్టి ప్రావిడెంటు ఫండుకు, 1925 వ సంవత్సరపు ప్రావిడెంటుఫండు చట్టము వర్తించవలెను. లేదా (2) ఆ ప్రావిడెంటుఫండు 1922 వ సంవత్సరపు ఆదాయపు పన్ను చట్టములోని సెక్షను 58—A ప్రకారము, ఆదాయపు పన్ను కమిషన్ వారిచే గుర్తింపబడినదై యుండవలెను. లేదా (3) రాష్ట్ర ప్రభుత్వముచే ఈ విషయమునకుగాను, ఒప్పుదల పొందిన ప్రావిడెంటుఫండు అయి వుండవలెను. మూడవ నిబంధన విషయములో రాష్ట్ర ప్రభుత్వము ఒప్పుదల వున్నంతవరకే, ఆ తీసివేతలు అమలు జరుపవచ్చును. 1922 వ సంవత్సరపు ఆదాయపు పన్ను చట్టములోని IX-A అధ్యాయములో ఇవ్వబడిన అర్థము ప్రకారము ప్రావిడెంటుఫండ్లు గుర్తింపబడవలెను. అట్టి గుర్తింపబడిన ప్రావిడెంటుఫండ్లుకు ఇచ్చు చందాలు, వాటిపై తీసికొన్న అడ్వాన్సుల చెల్లింపుకు ఈ క్లాజు వర్తించును. 1952 సంవత్సరపు ప్రావిడెంటుఫండు చట్టము ప్రకారము ఏర్పాటైన ప్రావిడెంటు ఫండ్లు, ఆ చట్టములోని 10 వ సెక్షను ప్రకారము, పైన చెప్పిన విధములో గుర్తింపబడిన ప్రావిడెంటుఫండ్లుగా భావింపబడును.

(బి) రాష్ట్ర ప్రభుత్వముచే ఒప్పుదల పొందిన సహకార సంఘములకు లేక పోష్టాఫీసులు నిర్వహించు భీమా పథకమునకు, చెల్లింపులకుగాను తీసివేతలు.

వీటికిగాను అమలు జరిపే తీసివేతలు వీటి విషయముగా రాష్ట్రప్రభుత్వము విధించిన షరతులను అనుసరించివుండవలెను.

(శి) జీవితభీమా కార్పొరేషను వారికి జీవితభీమా పట్టాకుగాను చెల్లింపవలసిన ప్రీమియము, లేదా భారత ప్రభుత్వమువారి ఋణ పత్రాల కొనుగోలుకుగాను చెల్లింపవలసిన మొత్తము లేదా పోష్టాఫీసులు నిర్వహించు ప్రభుత్వపు పొదుపు ప్రణాళికలకు గాను కట్టవలసిన మొత్తము— వీటికిగాను 'తీసివేతలు.'

ఈ తీసివేతలు ఉద్యోగి లిఖితపూర్వకముగా ఇచ్చిన అధికారముమీదనే అమలు జరుపవలెను. వీటికిగాను అమలుజరిపే 'తీసివేత'లు వీటికిగాను రాష్ట్రప్రభుత్వము విధించిన షరతులను అనుసరించి యుండవలెను.

## త ని ఖీ

**రిజిష్టర్లు, నోటీసులు :**

ఉద్యోగులకు చట్టము అనుమతించని తీసివేతలు లేకుండా, వేతనము చెల్లింపు జరుగవలెనన్న ఉద్దేశ్యముతో చట్టరీత్యా తయారుచేసిన రూల్సు ప్రకారము, యజమానులు దిగువ ఉదహరించిన రిజిష్టర్లను వుంచవలెను.

(1) జరిమానాల రిజిష్టరు.

(2) ఉద్యోగి అశ్రద్ధ లేక లోపము మూలముగా కలిగిన హాని లేక నష్టమునకు గాను అమలు జరిపిన తీసివేతల రిజిష్టరు.

(3) అడ్వాన్సులు వాటి వసూళ్ళ రిజిష్టరు.

(4) ఈ క్రింద కనబరచిన వివరములతో వేతనముల రిజిష్టరు.

(అ) వ్యక్తి గడించిన స్థూల వేతనము.

(ఆ) వేతనమునుంచి అమలు జరిపిన తీసివేతలు వివరములతో సహా.

(ఇ) ఉద్యోగికి చెల్లించిన నికర వేతనము.

తనఖీ కొరకు అవసరమైనపుడెల్ల, రిజిష్టర్లను తనఖీదారుకు అందజేయవలెను.

ఆంగ్లభాషలోను, అత్యధిక కార్మికులకు అర్థమయ్యే దేశభాషలోను, కార్మికుల సమాచారముకోసరము, యజమాని దిగువ కనబరచిన నోటీసులను ప్రదర్శించవలెను.

(1) అందరి ఉద్యోగుల వేతనపు రేటులను సూచించు నోటీసు.

(2) వేతన చెల్లింపు తేదీలను సూచించు నోటీసు.

(3) ఫ్యాక్టరీల ముఖ్య తనఖీదారు అనుమతి పొంది జరిమానాలు విధించ తగ్గ "చర్యలు లేక లోపములు" పట్టీ.

**అమలుపరచే పద్ధతి :** ఈ చట్టములోని అంశములను అమలు జరుపుటకు రాష్ట్రప్రభుత్వము, తనఖీదారులను నియమించును, ఫ్యాక్టరీ చట్టము క్రింద నియమింపబడిన "తనఖీదారులు"; ఈ చట్టమునకు గూడా తనఖీదారులుగా పరగణింపబడెదరు. వేరే అధికారులుకూడా ఈ చట్టము క్రింద తనఖీదారులుగా పరిగణించుటకు రాష్ట్రప్రభుత్వమునకు అధికార మొసగబడినది. ఉచితమైన ఎల్లవేళలలోను, తనఖీదారులు, ఫ్యాక్టరీల

లేక పారిశ్రామిక సంస్థల ఆవరణలో ప్రవేశించి, వివిధ రిజిష్ట ర్లను, వేతనము లెక్కలకు సంబంధించిన డాక్యుమెంట్లను తనఖీ చెయ్యవచ్చును. వారి తనఖీ చేసిన స్థలమున గాని లేక వేరే స్థల మునగాని అవసరమైన సాక్ష్యము తీసికొనవచ్చును.

(1) వేతనము నుంచి సరిగాని తీసివేతలకు (2) ఆలస్య ముగా వేతనము చెల్లింపుకు, సిబ్బంది ధాఖలుచేయు 'క్లయిము' లను విని, తీర్మానించుటకు రాష్ట్ర ప్రభుత్వము 'అధికారులను నియమించవలెను. వీరే 'వేతనము చెల్లింపు చట్టము' క్రింద' అధికార పురుషులని పిలువబడుదురు. నియమిత ప్రదేశమునకు ఒకరు గాని అంతకు మించిన వ్యక్తులను అధికార పురుషులుగా నియమించుటకు రాష్ట్ర ప్రభుత్వమునకు అధికార మొసగబడి నది. అటుల నియుక్తులైన అధికార పురుషుల మధ్య పనిని పంచుటకుగా ఆదేశముల నిచ్చు హక్కుకూడా రాష్ట్ర ప్రభుత్వ ములకు గలదు.

## క్లయిము

**క్లయిము దరఖాస్తులు** :- (1) వేతనము చెల్లింపు, గడువు తేది దాటి ఆలస్యమయినా లేక (2) చట్టము నతిక్రమించి వేతనము నుంచి తీసివేతలు అమలు జరిపినా, వాటిని రాబట్టుటకు 'అధికార పురుషులు' కోర్టులో దరఖాస్తు వేయ వచ్చును. ఈ దరఖాస్తును, మొదటి కారణమునకు వేతనము చెల్లింపుకు గడువు తేదీ నుంచి ఆరు నెలలలోపున, రెండవ కారణమునకు, అట్టి అక్రమ "తీసివేత"లు అమలు జరిపిన లగాయితు ఆరు నెలలు లోపుగా దాఖలు చేయువలెను. అయినప్పటి కిన్నీ, తగువైన కారణమువల్ల, ఈ గడువు లోపల దరఖాస్తు వేయకపోయినా, అట్టి ఆలస్యమును మన్నించుటకు "అధికార పురుషునికి" అధికార మీయబడినది. దరఖాస్తుకు ఇరువైపు పార్టీల అభిప్రాయము విన్న మీదటనే, ఆలస్యాన్ని మన్నించ

డమా లేదా అన్న విషయం తీర్మానించవలెను. ముందుగా దీలిని తేల్చనిదే, క్లయిము దరఖాస్తు అనుమతింపబడదు. అట్టి ఆలస్యమునకు తగువైన కారణము ఏది అన్న విషయము "అధికార పురుషుని" యొక్క వ్యక్తిగతఅభిప్రాయముపై ఆధారపడకుండా, న్యాయ సూత్రాలను ప్రయోగించి తేల్చవలెను.

క్లయిము దరఖాస్తు వేయగలిగిన వ్యక్తి ఎవరు ?

ఈ దిగువ ఉదహరించిన వ్యక్తులలో ఏ ఒక్కరైన క్లయిము దరఖాస్తు చేయవచ్చును.

(అ) సంబంధించిన ఉద్యోగి

(ఆ) ఉద్యోగిచేత అతని తరపున వాదించుటకు ప్రత్యేకముగా అధికారము స్వీకరించిన న్యాయవాదిగాని లేక 1926 వ సంవత్సరపు కార్మిక సంఘముల చట్టముక్రింద రిజిష్టరు కావింపబడిన కార్మిక సంఘముయొక్క కార్యనిర్వాహకుడు.

(ఇ) ఈ చట్టము క్రింద నియమింపబడిన తనఖీదారు.

(ఈ) ఈ చట్టము క్రింద నియమింపబడిన అధికార పురుషుని అనుమతితో పనిచేయు ఏ వ్యక్తియైనా.

పనిచేయు ప్రతి వుద్యోగి, ప్రత్యేకముగా దరఖాస్తువేయవలసిన అవసరము ఎల్లప్పుడు లేదు. పెక్కురు వుద్యోగులు పనిచేయు ఒకేసంస్థలో, గడువుదాటినా వేతనము చెల్లింపనిచో వారందరును 'వేతనము పొందని' ఒకే వర్గముక్రింద జమకట్టబడుదురు. అట్టి పరిస్థితిలో, ఆ వర్గము తరపున ఒక క్లయిము దరఖాస్తువేసిన చాలును. కాని ఈపద్ధతి 'అక్రమ తీసివేత'ల విషయానికి వర్తించదు. పైన చెప్పిన 'వేతనము పొందని' వర్గములోని వుద్యోగులు ఒకటికి మించి దరఖాస్తులు వేసినప్పటికి, అధికార పురుషుడు వాటి నన్నిటిని ఆ వర్గమువారి ఒకే దరఖాస్తుగా భావింపవచ్చును.

'అధికార పురుషుడు' దరఖాస్తు విన్నమీదట ఆ దరఖాస్తును దురుద్దేశముతోగాని, యజమానిని విసిగించుటకుగాని వేయబడినదన్న అభిప్రాయమునకు వచ్చినచో, దరఖాస్తుదారు, యాభై రూపాయలకు మించని పెనాల్టీని, యజమానికిగాని, లేక వేతనము చెల్లింపుకు బాధ్యుడైన వ్యక్తికిగాని, చెల్లింపవలెనని ఆదేశమివ్వవచ్చును.

క్లయిము దరఖాస్తులను విచారించడములో, అధికార పురుషుని న్యాయాధికారము (జూరిస్ డిక్షన్) చాలా పరిమితమైనది. న్యాయమూర్తులు, సి. జె. ఛాగ్లావారు ఎ. ఆర్. షరీస్ బి. సి. పాటిలు మధ్య జరిగిన తగాదా విచారణలో న్యాయాధికారపు పరిమితిని ఈ క్రింది విధముగా వివరించిరి. "వేతనము చెల్లింపువిషయములలో కాంట్రాక్టులోని షరతులను నిర్ణయించుట, కాంట్రాక్టు షరతుల ప్రకారము వేతనము చెల్లింపుకు యజమాని బాధ్యత, వీటిని మాత్రమే పరిశీలించుటకు మాత్రమే, అధికార పురుషుని న్యాయాధికారము గలదు. యజమాని ఆరోపించినరీతి కాంట్రాక్టు ముగిసినదా లేక వుద్యోగి వాదన ప్రకారము కాంట్రాక్టు అమలులో నున్నదా అన్న విషయము నిర్ణయించుటకు న్యాయాధికారము లేదు."

ఈ విషయమును సుప్రీంకోర్టువారు కూడా ఈ మధ్యనే పరిశీలించి ఈ దిగువ అభిప్రాయమును వెలిబుచ్చిరి.

"కక్షీదారుల మధ్య కాంట్రాక్టులోని షరతుల నిర్ణయించుటకు, అనగా వాస్తవిక వేతనమును నిర్ణయించుటకు అధికార పురుషునికి న్యాయాధికారము గలదు. కాని యీ న్యాయాధికారము "నిబిడ వేతనము" నిర్ణయించుటకు వర్తించదు".

**అప్పీలు:—** యజమానిపై వుద్యోగులు వేసిన క్లయిము దరఖాస్తు పూర్తిగాగాని, పార్శ్వముగాగాని, అధికార పురు

షుడు త్రోసివేసినచో, అట్టి వుత్తరువుపై అప్పీలు చేయుటకు అవకాశము గలదు. అదే విధముగా, యజమాని వుద్యోగికి పరిహార మివ్వవలెనని, లేదా యజమానిపైగాని, వుద్యోగిపై గాని పెనాల్టీ విధించు వుత్తరువులపైకూడా అప్పీలు చేయ వచ్చును. కానీ ఈ అప్పీలుచేయు హక్కు కొన్నిషరతులకు కట్టుబడియుండవలెను. వేతనముగాను, పరిహారముగాను చెల్లిం చుటకు ఆదేశ మివ్వబడిన మొత్తము మూడువందల రూపాయ లకు పైబడితేనే, యజమానిగాని, వేతనము చెల్లింపుకు బాధ్యు డైన వ్యక్తిగాని అప్పీలు చేయవచ్చును. ఉద్యోగినుంచిగాని లేదా అతనికి సంబంధించిన వేతనము పొందని వర్గమునుంచి గాని యజమాని బిగబట్టి, వారిచే క్లయిము చేయబడిన వేత నము యాభై రూపాయలకు పైబడిననే, వుద్యోగి అధికార పురుషుని వుత్తరువుపై అప్పీలు చేయవచ్చును. ఉద్యోగికి ఇవ్వ బడిన అప్పీలుచేయు హక్కు యజమాని వుద్యోగికి కొంత మొత్తమివ్వవలె నన్న ఆదేశములపైననే కాక, ఆ దరఖాస్తు విచారించినమీదట, దరఖాస్తుదారుడు ఎట్టి మొత్తమునకు అర్హుడుకాడన్న అభిప్రాయముతో దరఖాస్తును త్రోసివేస్తూ ఏ ఆదేశ మివ్వని సందర్భములోకూడా ఆ హక్కు ఇవ్వబడినది. దరఖాస్తు అర్హతలపై కాకుండా, తనకు న్యాయాధికారము లేదన్న కారణమువల్ల వుద్యోగికి ఎట్టి నివృత్తి కలిగించనిచో ఆ పరిస్థితి ఆదేశము నిరాకరింపబడినట్లుగా ఎంచబడదు. కాబట్టి వుద్యోగికి అప్పీలుచేయు హక్కు వుండవలెనన్న, అతని దర ఖాస్తును దఖలుపరచుకోవడమే కాకుండా ఆ దరఖాస్తు అర్హత లపై ఆదేశ మిచ్చుటకు నిరాకరింపబడి యుండవలెను.

అధికార పురుషుడు ఆదేశ మిచ్చిన తేదీనుంచి, ముప్పది రోజులలోపుగా అప్పీలు చేయవలెను.

ఉద్యోగి తరఫున అప్పీలు చేయుటకు అధికారము ఇంతకు పూర్వము వుదహరించినట్లు క్లయిము దరఖాస్తు వేయ గల అర్హత ఎవరెవ్వరికిగలదో, వారందరికి ఇవ్వబడినది.

ప్రెసిడెన్సీపట్టణములలో (అనగా మద్రాసు, బొంబాయి కలకత్తా నగరములలో స్మాల్ కాజెస్ కోర్టువారికి అప్పీలు చేయవలెను. ఇతర ప్రదేశములలో ఫ్యాక్టరీ లేక పారిశ్రామిక సంస్థయొక్క వునికినిబట్టి, వాటిపై న్యాయాధికారముగల జిల్లాకోర్టులో దాఖలుచేయవలెను, జిల్లాకోర్టులో దాఖలుచేసిన పక్షములో, అది హైకోర్టుకు, క్రిందికోర్టుకాక చట్టములో వేరే అప్పీలుకు ఆస్కారము లేనప్పటికి, సివిలు ప్రొసీజరుకోడులోని 115వ సెక్షను ప్రకారము జిల్లాకోర్టువారి తీర్మానముపై, హైకోర్టులో రివిజను దరఖాస్తు వేయవచ్చును.

**చెల్లింపునకు ఆదేశ మివ్వబడిన మొత్తము వసూలు:-**

ఆదేశ ప్రకారము యజమాని, వుద్యోగికి చెల్లింపవలసిన మొత్తమును వసూలు చేయవలెను.

**ఆస్తిని షరతుబద్ధమైన జప్తీ చేయుట:—** అధికార పురుషుడుగాని, అప్పీలుకోర్టుగాని, యజమాని అంతిమముగా యివ్వవలెనని వుత్తరువు చేసిన మొత్తము ఎగగొట్టే వుద్దేశ ముతో వున్నాడని అనుమానముగలిగిన, ఆస్తిని షరతుబద్ధమైన జప్తీచేయుటకు చట్టములో అవకాశము చేకూర్చబడినది. యజ మాని తన ఆస్థిని అమ్మిగాని, మరి వేరేవిధముగాగాని, మొత్త మును ఎగగొట్టే తలంపుతో వున్నాడని, అధికార పురుషుడు గాని, కోర్టువారుగాని విశ్వసించిన ఎడల, తమవద్ద కేసు విచా రణ జరుగుచున్నపుడే ఆస్తిపై జప్తీకిగాను వుత్తరువు జారీ

చేయవచ్చును. అట్టి వుత్తరువు జారీచేయుటకు ముందు కోర్టు వారు యజమాని తన వాదనను తెలుపుకొనుటకు అవకాశ మొసగవచ్చును. అట్టి అవకాశ మొసగుటవల్ల కలిగిన ఆలస్య మూలముగా, న్యాయము చేకూరదని అధికార పురుషుడుగాని కోర్టువారుగాని అభిప్రాయపడిన అట్టి అవకాశ మివ్వకపో వచ్చును. అట్టి పరిస్థితులలో జప్తిచేయుటకు ఆస్తివిలువ అధి కార పురుషుడుగాని, కోర్టువారుగాని, చెల్లింపు ఆదేశ మిచ్చిన మొత్తమునకు సరిపోవలెను.

సివిలుకోర్టులలో దావాలపై నిషేధము:— ఈ దిగువ పేర్కొనబడిన పరిస్థితులలో వేతనమునకుగాను, వేతనమునుంచి అమలుజరిపిన "అక్రమ తీసివేతల" వసూలుకుగాను వేసిన దావాలు సివిలు కోర్టులలో అనుమతింపబడవు.

(అ) క్లయిము చేసిన మొత్తము గురించి "అధికార పురుషుని" కోర్టులో దరఖాస్తు విచారణలో వున్నా లేదా అట్టి దరఖాస్తుపై అప్పీలు 'అప్పిలేటు కోర్టు' వారి సమక్షములో విచారణలోవున్నా, లేక

(ఆ) క్లయిము దరఖాస్తుపై, వాది పరముగా ఆదేశ మివ్వబడిన మొత్తము గురించి క్లయిము దావాలు, లేక

(ఇ) క్లయిముచేసిన మొత్తమునకు, వాది అనర్హుడని క్లయిము దరఖాస్తు విచారణలో తేలిన, లేక

(ఈ) క్లయిము చేసిన మొత్తము, క్లయిము దరఖాస్తు ద్వారా రాబట్టగలిగే అవకాశముంటే.

# చిల్లర విషయములు

పెనాల్టీలు:- చట్టము నిర్ణయించిన గడువును దాటి ఆలస్యముగా వేతనము చెల్లింపు, చట్టములోని అంశముల నతిక్రమించు తీసివేతలు ఈ చట్టము క్రింద శిక్షార్హనీయములు. ఈ నేరములకు జరిమానా ఐదువందల వరకు విధించవచ్చును.

చట్టము క్రింద నేరములుగా పరిగణింపబడిన ఈ క్రింది నేరములకు, రెండువందల వరకు జరిమానా విధింపవచ్చును.

(1) చట్టములోని అంశముల ప్రకారము వేతనకాలము నిర్ణయింపక పోవుట.

(2) ప్రచారములో నున్న నాణెము, లేదా నోట్లు లేదా రెండింటి ద్వారాగాని వేతనము చెల్లింపకపోవుట.

(3) చట్టములోని 25 వ సెక్షను ప్రకారము చట్టముయొక్క సారాంశమును, రూల్సును ప్రదర్శింపకపోవుట.

పెనాల్టీలను అమలుపరచు విధానము:- ఆలస్యమైన వేతనము చెల్లింపు, చట్టవిరుద్ధమైన అక్రమ తీసివేతల విషయములో చట్టములోని అంశములను వుల్లంఘించి నేరమునకుగాను, ఆ ఫిర్యాదులను కోర్టువారు అనుమతించే ముందు వాటి విషయములో క్లయిము దరఖాస్తు వేయబడి అధికార పురుషునిచేగాని లేక అప్పిలేటు కోర్టువారినేగాని అనుమతింపబడియుండవలెను. అట్టి ఫిర్యాదు చేయుటకు అనుమతించే ముందు 'అధికార పురుషుడు'గాని అప్పిలేటు కోర్టువారుగాని, ఎవరిపై ఫిర్యాదు తేబడినదో, వారికి ఫిర్యాదు అనుమతించుటకు అభ్యంతరము ఏదైన వుండిన తెలుపుకొనుటకు అవకాశ మివ్వవలెను.

(అ) వుద్యోగికిగాని న్యాయరీత్యా అతని ప్రతినిధికిగాని, ఇవ్వ వలసిన మొత్తమును గురించి విశ్వసనీయమైన పొరపాటుగాని లేక తగాదాగానీ, లేదా (ఆ) అసాధారణ పరిస్థితులవల్లగాని లేక అనూహ్యా పరిస్థితులవల్లగాని చట్టములోని అంశములను అమలు జరుపుటకు వీలులేకపోయినా లేక (ఇ) వుద్యోగిగాని, అతని ప్రతినిధిగాని, వేతనము అడగలేక స్వీకరించని, తప్పిదము చేసినా, అధికార పురుషుడుగాని, కోర్టువారుగాని ఫిర్యాదుకు అనుమతింపక పోవచ్చును. ఇట్టి పరిస్థితులలోనే, 'అధికార పురుషుడు' పరిహారమునకు ఆదేశమిచ్చుటకు నిరాకరింప వచ్చునన్న సంగతి గమనింవవలెను.

వేతనకాలము నిర్ణయింపకపోవడము, లేక ప్రచారములో వున్న నాణెముద్వారా, నోట్లద్వారా వేతనము చెల్లింపకపోవడము లేక చట్టము ననుసరించి తయారుచేసిన రూల్సును అనుసరించకపోవడము మొదలైన ఫిర్యాదులను చట్టరీత్యా నియుక్తులైన తనిఖీదారుఆరోపణమీదనే వాటిని కోర్టువారు పరికించెదరు.

**చట్టవిరుద్ధమైన కాంట్రాక్టులు చెల్లవు:**— చట్టముక్రింద వుద్యోగులకు ఇవ్వబడిన హక్కులను వదులుకుంటూ, చట్టము రాకపూర్వముగాని, చట్టము వచ్చినతర్వాతగాని, ఏ వ్యక్తియైనా అగ్రిమెంటుగాని, కాంట్రాక్టుగాని, ప్రవేశించదలచినా అట్టి కాంట్రాక్టులు లేదా అగ్రిమెంట్లు యెంతమాత్రము చెల్లనేరవు. కాబట్టి అట్టి అగ్రిమెంటు వున్నప్పటికి, వుద్యోగరీత్యా చట్టరీత్యా తనకుగల హక్కులను అమలుజరుపవచ్చును.

**సంగ్రహ చట్ట ప్రదర్శన:**— ఆంగ్లభాషలోను, అధిక సంఖ్యాకులైన వుద్యోగులకు అర్థమయ్యే భాషలోను చట్టము

క్రింద వుద్యోగులకు సంక్రమించే హక్కులు, లాభాలు, తెలుసు కొనేదానికి వీలుగా యజమానిగాని, లేదా వుద్యోగుల వేత నము చెల్లింపునకు బాధ్యుడైన వ్యక్తిగాని, ఫ్యాక్టరీ నోటీసు బోర్డుపై సంగ్రహ చట్టాన్ని, చట్టముక్రింద తయారుచేసిన రూల్సును ప్రదర్శించవలెను.

రూల్సును తయారుచేసే అధికారము:—అధికార పురు షులు మరియు అప్పిలేటు కోర్టు అనుసరించవలసిన పద్ధతిని క్రమమార్గములో వుంచుటకు మరియు చట్టములోని అంశము లను అమలు జరిపేటందుకు, రాష్ట్ర ప్రభుత్వాలకు రూల్సును తయారుచేసే అధికార మివ్వబడినది.

---

# GLOSSARY — పరిభాషా పదకోశము

| | | |
|---|---|---|
| 1. Fines | ... | జరిమానాలు |
| 2. Perennial | ... | అనవరత |
| 3. Deductions | ... | తీసివేతలు |
| 4. Wrongful | ... | అక్రమ, సరికాని |
| 5. Acts and omissions | ... | చర్యలు లోపములు |
| 6. Damage | ... | హాని |
| 7. Loss | ... | నష్టము |
| 8. Tools | ... | కొరముట్లు |
| 9. Services | ... | ప్రయోజనములు |
| 10. Amenities | ... | వసతులు |
| 11. Administration | ... | యాజమాన్యము, పరిపాలనావర్గము |
| 12. Industrial Establishment | ... | పారిశ్రామిక సంస్థ |
| 13. Wages | ... | వేతనము |
| 14. Payment | ... | చెల్లింపు |
| 15. Remuneration | ... | ప్రతిఫలము |
| 16. Award | ... | తీర్పు |
| 17. Holidays | ... | పర్వపు దినములు |
| 18. Leave period | ... | సెలవు కాలము |
| 19. Over - time work | ... | కాలావధిని మించి చేసిన పని |
| 20. Inland ressel | ... | దేశీయ నౌక |
| 21. Wage - Period | ... | వేతన కాలము |
| 22. Recognised | ... | గుర్తింపబడిన |
| 23. Chief Inspector of Factories | ... | ఫ్యాక్టరీల ముఖ్య తనఖీదారు |
| 24. Inspector | ... | తనఖీదారు |

| | | |
|---|---|---|
| 25. | Absence | ... గైరుహాజరు |
| 26. | Stay - in - strike | ... ఫ్యాక్టరీ అంతర్గత సమ్మె |
| 27. | Recovery | ... వసూలు |
| 28. | Travelling allowance | ... ప్రయాణపు బత్తెము |
| 29. | Commissioner of Income - Tax | ... ఆదాయపు పన్ను కమీషనరు |
| 30. | Subscription Contribution | ... చందా |
| 31. | Life Insurance policy | ... జీవితభీమా పట్టా |
| 32. | Securities | ... ఋణ పత్రములు |
| 33. | Gross wages | ... స్థూల వేతనము |
| 34. | Authority | ... అధికార పురుషుడు |
| 35. | Officer | ... అధికారి |
| 36. | Unpaid group | ... వేతనము పొందని వర్గము |
| 37. | Compensation | ... పరిహారము |
| 38. | Bona fide | ... విశ్వసనీయమైన |
| 39. | Juris diction | ... న్యాయాధికారము |
| 40. | Pot ential wage | ... నిబడ వేతనము |
| 41. | Actual wage | ... వాస్తవిక వేతనము |
| 42. | Provisions | ... అంశములు |
| 43. | Attachment | ... జప్తి |
| 44. | Direction | ... ఆదేశము |

అధికార పురుషుని సమక్షములో విచారణ:- క్లయిము దరఖాస్తు దాఖలయిన పిమ్మట, ఆ దరఖాస్తుకు అభ్యంతరము లే వైనా తెలుపుకొనవలెనని, యజమానికి, మఱియు వేతనము చెల్లింపుకు బాధ్యులైన వ్యక్తికి 'అధికార పురుషుడు' నోటీసు పంపవలెను. ఆ తరువాత 'అధికార పురుషుడు' దరఖాస్తునకు పార్టీలైన వాది, ప్రతివాదుల వాదనలను వినవలెను. లేదా వారి వాదనలను వినుటకు అవకాశ మొసగవలెను. క్లయిము స్థిరపడనిచో- యజమాని, తన వుద్యోగి లేదా వుద్యోగులకు, ఆలస్యమయిన వేతనము చెల్లింపవలెనని లేదా అక్రమ తీసివేతల మొత్తము వాపసు చేయవలెనని అధికార పురుషుడు ఆదేశ ముల నొసగును. ఇంతేకాకుండా, అదనముగా యజమాని వుద్యోగికి పరిహార మొసగవలెనని, అధికార పురుషుడు ఆదేశ మివ్వవచ్చును. అట్టి పరిహారము అక్రమ తీసివేతల విషయ ములో, తీసివేసిన మొత్తమునకు పదియంతలు, ఆలస్యమైన వేతనము చెల్లింపుకుగాను పది రూపాయలను మించరాదు. వేతనము చెల్లింపు ఆలస్యమయినపుడు, ప్రత్యేక దరఖాస్తులకు బదులు వర్గపు దరఖాస్తు వేసినదైన ప్రతి వుద్యోగికి పది రూపా యల చొప్పున ఈ పరిహారము యొక్క గరిష్ట పరిమితి నిర్ణ యింప బడినది.

(అ) సంబంధించిన వుద్యోగికి ఇవ్వవలసిన మొత్తము గురించి, విశ్వసనీయమైన పొరపాటుగాని లేక తగాదాగాని వున్నందువల్ల, లేదా (ఆ) వేతనము చెల్లింపుకు బాధ్యుడైన వ్యక్తి, వుచితమైన జాగ్రత్త ప్రదర్శించినప్పటికి, అసాధారణ పరిస్థితుల మూలముగా వేతనము సరియైన కాలమునకు చెల్లిం పకపోయినా లేదా (ఇ) వుద్యోగి జీతము అడుగనందువల్ల, స్వీకరించనందువల్ల, వేతనము చెల్లింపు ఆలస్యమయినదని అధి కార పురుషుడు విశ్వసించిన, పైన చెప్పిన పరిహారమునకు వుత్తర్వు ఒసగబడదు.